ఓమ్.



# శ్రీ సంగమేశ్వరశతకము

శ్రీ చామర్లపూడి గ్రామమందు కృష్ణా-తుంగభద్రా
సంగమసమీప స్థలమున వేంచేసియుండు
శ్రీ సంగమేశ్వర స్వామివారిపై

**పరిమి వేంకటాచలకవిచే**

రచియింపబడియె.

గుంటూరు వాస్తవ్యుడు పరిమి కృష్ణయ్యగారిచే ప్రకటింపఁబడియె.

రెండవకూర్పు 1000 ప్రతులు.

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడియె.

 1931 [వెల 2 అ.

ఓమ్.

# శ్రీ సంగమేశ్వర శతకము.

శ్రీ చామర్లపూఁడి గ్రామమునకు కృష్ణా తుంగభద్రా
సంగమమైన స్థలమున వేంచేసియుండు
శ్రీ సంగమేశ్వరస్వామివారిపై

పరిమి వేంకటాచల కవిచే
రచియింపఁబడియె.

రెండవకూర్పు: 1000 ప్రతులు.

బెజవాడ, ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపఁబడియె.

1931



[వెల 2 అణాలు.

# విజ్ఞప్తి.



ఈ కవిపుంగవుఁడు ఆదిశాఖీయబ్రాహ్మణుఁడు. "పరిమివంశపయః పారావారసోమజాతుఁడు. వేంకటాచలకవి యనుపేరివాఁడు. హారితసగోత్రసంభవుఁడు. తండ్రి రఘునాయకుఁడు. తల్లి సూరమాంబ. జన్మస్థానము గుంటూరుమండలమునఁగల తెనాలితాలూకాయందలి చిన పరిమి యనుగ్రామము. ఈకవి యిప్పటికి రమారమి నూటయిరువది వత్సరముల క్రిందట జీవించియుండెను. ఈకవిసంతతివారు గుంటూరు మండలమున [illegible]. గుంటూరు పురపారిశుద్ధ్యసంఘకార్యాలయోద్యోగి పరిమి సూర్యనారాయణ గారును విజయవాటికాప్రభుత్వవైద్యాలయోద్యోగి పరిమి సీతారామయ్య గారును నీకవిసంతతిలోనివారే. ఈ సూర్యనారాయణగారీకవికి నైదవతరము వాఁడని తెలియవచ్చెడిని.

కృష్ణవేణీ - తుంగభద్రాసంగమసమీపస్థ చామర్లపూడి (సంగమ మూడి)గ్రామమున వేంచేసియున్న శివమూర్తి యగు శ్రీ సంగమేశ్వరస్వామి పైధ్యానపూర్వకముగ నీ సంగమేశ్వరశతకమును జెప్పియుండెను.

ఈకవి సంస్కృతాంధ్రములం దసమానపాండితిఁ గడించినవాఁడని యీ శతకరచనం బట్టి చెప్పనొప్పును. ఇది సంస్కృతపదభూయిష్ఠమైనను, మూలపదములుగాని శ్రుతికటువగు పలుకులుగాని లేక నిసర్గశోభాధారాశుద్ధి గలిగి, ద్రాక్షాపాకమున, భక్తిరసము వెల్లివిరియ సలక్షణముగ నలరారుచున్నది. భక్తియుక్తముగఁ జెప్పఁబడి యిప్పటికి వెలువడిన శతకరాజముల కిది యొందును దీసిపోదని మనవిఁజేయుచు నింతటు విరమించుచున్నాఁడను.

బెజవాడ,
20—4—31.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
కర్లపాలెము కోదండరామయ్య.



శ్రీరస్తు.

# సంగమేశ్వర శతకము.

ఉ. శ్రీగిరిజాపయోధరప♦రిస్ఫుటచర్చితసారగంధగం
ధాగరుకుంకుమాంకితస♦మంచితురస్క! జగత్పరిపాలనో
ద్యోగమనస్క! శారదప♦యోదసమానయశస్క! సంతతా
భోగవయస్క! సర్వముని♦పూజిత! కూడలి సంగమేశ్వరా!

ఉ. పాణితలాంచితాంకుశకృ♦పాణపయోనిధితూణ! భక్తసం
త్రాణ! నతాఖిలాగమపు♦రాణ! నిజాప్తభవాంబుభృజ్జగ
త్ప్రాణ! యనూనశౌర్యబల♦ధైర్యధురీణ! వృషాధిరాజకం
ఖాణ! మురారిబాణ! నను♦గావవె కూడలి సంగమేశ్వరా! ౨

ఉ. భాసితమందహాస, పరి♦పాలితదాస, వ్రితోగ్రకల్మష
త్రాస, పరాక్రమానలవి♦దగ్ధనిశాచరఘాస, సంతతో
ల్లాస, శివామనోహరవి♦లాస, సురాద్రిశరాస, దివ్యకై
లాసనివాస నిన్మది ద♦లంచెద కూడలి సంగమేశ్వరా! 3

ఉ. హాటకశైలసన్నిభవృ♦షాధిపఘోట, హిమాద్రిజామనో
బ్జాట, లసత్కిరీట, సుజ♦నాఘభవాగ్నికృపీట, జాహ్నవీ
ఝూట, కరాగ్రశోభిమృగ♦శూలపినాకకరోట, వాఙ్నరా
ఘాట, విపత్కవాట, నను♦గావవె కూడలి సంగమేశ్వరా!

ఉ. ఖండితదైత్యకాండ, త్రిజ♦గత్పరిపాలనశౌండ, చండదో
ర్దండ, భవాగ్నికాండ, జఠ♦రస్థితపద్మభవాండ, భండనో
ద్దండ, మురారికాండ, యవ♦తంసితసద్విధుఖండ, భోగిరా
ట్కుండలశోభిగండ, నిను♦గొల్చెద కూడలి సంగమేశ్వరా!

ఉ. స్తంభితకుంభి దైత్యమదదంభ, సమస్తజగత్పరిపాలనా
రంభ, పృథూరు కాంతిజితరంభ, సదాఘటితాద్రిజాపరీ
రంభ, చిరాయురున్నత సురక్షితభూసురడింభ, చండదో
స్తంభ, శుభంబులిమ్ము దయదప్పక కూడలి సంగమేశ్వరా!

ఉ. సాంబ, నిజాహ్వయార్కదళితాఘతమోనికురుంబ, సత్కృపా
లంబ, మదేభచర్మపరిలగ్ననితంబ, నిశాటభూమిభృ
చ్చుంబ, యశోవిడంబ, సురసంయమిజాలమనోంబుజాతరో
లంబ వరమ్ములిమ్ము పదిలంబుగ కూడలి సంగమేశ్వరా!

ఉ. ఈశ! విపద్వినాశ! మునిహృత్సరసీజనివేశ! కాలకూ
టాశ! యశఃప్రశోభిసకలాశదినేశ! సహస్రకోటిసం
కాశ! స్వనామనిర్దళిత కల్మషపాశ! సఖీభవద్ధృషీ
కేశ! మదీయపాప మణగింపవె కూడలి సంగమేశ్వరా! ౮

చ. నతహృదయాబ్జభాస్వదరుణాకరుణావరుణాలయాహరి
త్పతినుత! మావిబర్హిశరదా! వరదా! వరదాసపోష! సం
తతగజచర్మచేలజఘనా! యఘనాశ! ఘనాఘనప్రభా
సితగళశ్రీకరాశ్రితవశీకర! కూడలి సంగమేశ్వరా! ౯

చ. వననిధితూణదూరితభవా! విభవాఢ్య! భవా! త్రిలోకపా
వన! పరిగుప్తపంకజభవా యభవా శుభవారిమిత్ర! చం
దనఘనసారకీర్తిసహితా! మహితా బహితాగ్నిసోమనే
త్రినగసుశాతశాంతగుణరాజిత కూడలిసంగమేశ్వరా! ౧౦

చ. రవిశశివహ్నిలోచన! ధరారథ! రాజధరా! జగన్నుతా
భవ! గిరిజాపయోధరసుపర్వతవారిద! శేషభూష! శ్రీ

ధవశర! కాలకంఠ! ప్రమథవ్రజపాలసుశీల! చూనిమి
త్ర!విబుధపూజితా! సుగుణరాజిత! కూడలిసంగమేశ్వరా!

చ. అసమవిలోక! లోకనిచయాంతరపూరితకీర్తిసార! సా
రసభవముఖ్యదేవనికరస్తుతభండతరప్రతాప! తా
పసహితభావభూహరణభస్మలసద్విమలాంగ! లాంగలా
ద్యసదృశభద్రలక్షణపదాంబుజ! కూడలి సంగమేశ్వరా!

చ. శ్రితజనరక్షణా! కుజనశిక్షణ! రవ్యనలేందువీక్షణా!
శ్రుతిహితభాషణా! దురితశోషణ! భోగికులీనభూషణా!
చతురదయాకరా! ధృతినిశాకర! దానవచిత్తభీకరా!
హితకమలేశ్వరా! త్రిజగదీశ్వర! కూడలి సంగమేశ్వరా!

ఉ. దండము, మండలీభవదుదారపినాకసమాఖ్యదివ్యకో
దండసముద్భవప్రకటదారుణకాలభుజంగ! చండమా
ర్తాండసమానఘోరనిశితస్ఫుటసాయక! ఖండితోగ్రవే
దండజలంధరప్రముఖదానవ! కూడలి సంగమేశ్వరా!౧౭

ఉ. పాయకనన్నుబ్రోవుము కృపామతితో గిరిశాయ! వామదే
వాయ!త్రిలోకభవ్యవిభవాయ!భవాయ!శివాయ! దేవదే
వాయ!మృడాయ!దూరితభవాయ!కపాలధరాయ! మేరుచా
పాయ! నమోస్తుతే! యనుచుబల్కెదకూడలిసంగమేశ్వరా!

చ. నిను దృఢభక్తి గొల్వగలనే? యిల నేగల నేర్పుతోడుతం
డ్రనర భజింప గావ దగదా? తగదా? యటంచు నె
మ్మనమున నమ్మినాడ, కనుమా! వినుమా! నినుమానసంబునం
దనిశము గొల్తునయ్య! కరుణాన్విత! కూడలిసంగమేశ్వరా!

చ. ఒకనరు నాశ్రయింప, నతఁడోపికమీర గటాక్షదృష్టిచే
నకుటిలబుద్ధి బ్రోచునట; యారయ సర్వసరోజజాండనా
యకుడవు, భక్తవత్సలుడ వంచని నమ్మి భజించువారికో
రిక లొసగూర్పకుందువె? ధరిత్రిని కూడలి సంగమేశ్వరా!

ఉ. నెయ్యముమీర తొల్లి కరుణించవె సత్కృపతోడమాదిరా
జయ్యను, పండితార్యబసవయ్యను, జ్ఞానమయాజికాటకో
టయ్యను, కేశిరాజు శిరియాళుని, చోళమహేశు, సిద్ధరా
మయ్యను, బాచిరాజవరదయ్యను కూడలిసంగమేశ్వరా!

చ. సుదతులజూచినట్లు నినుజూడగగోరవు కన్ను లెప్పుడున్,
హృదయము దుష్టసంగతుల కేగినరీతి త్వదీయమూర్తి జే
రదు, నరనాయకాధముల బ్రస్తుతిజేసినభంగి జిహ్వ నీ
సదమలనామకీర్తనము సల్పదు కూడలి సంగమేశ్వరా!

చ. ఎఱుగక ఘోరకృత్యము లనేకము జేసితి పాపబుద్ధినై
మఱచితి కాలు డేమియవమాన మొనర్చునొ? యంచు నాత్మలో
వెఱచుచు నాకు దిక్కు కను వేరె మఱెవ్వరు లేరటంచు నీ
మఱుగున జొచ్చితిన్ వెతలు మాన్పవె కూడలిసంగమేశ్వరా!

ఉ. కల్లలుగావు నీవె గతిగాని మఱేమియెఱుంగ నంచు నే
నెల్లవిధంబుల న్బలుక నీగతి నీవు పరాకుసేయగా
జెల్లునె? యెవ్వ రింక దయ సేయగజూచెదరయ్య! కల్గునే
తల్లికి గల్గినట్టిదయ దాదికి? కూడలి సంగమేశ్వరా! ౨౧

ఉ. తల్లియు దండ్రియుం గురుడు దైవము దాతయు నీవె యంచు నా
యుల్లమునందు నమ్మితి నయో! కరుణింపవు, దీనవృత్తిచే

పల్లటిలంగనోప నర♦పాలుర వేడగజాల నాపయిం
జల్లనిచూపుఁ వేగ వెద♦జల్లుము కూడలి సంగమేశ్వరా!

ఉ. నాపయి నీదయామృతక♦ణం బొకయించుక జిల్కితేని, సం
తాపము బాయదే, భవవి♦తానము ద్రుంగదె, లేమి గ్రుంగదే,
పాపము దూలదే, ఘనవి♦పద్దశ తెల్లదె, కోర్కె దీరదే,
నీ పదభక్తి గల్గదె, గ♦ణింపగ కూడలి సంగమేశ్వరా! ౨౩

ఉ. నీచులగొల్వ రోసి తగ♦నిన్నె భజించితి, వేడ్కతోడ రా
రా చలమేలరా? వలదు♦రా వినరా దయమీర నేలుకో
రా చనుపెయ్యరా పలుక♦రా మది నెప్పుడు నిన్నె నమ్మినా
రా పదభక్తి నియ్యగద♦రా యిక కూడలి సంగమేశ్వరా!

ఉ. చయ్యన తావకీనపద♦సారసయుగ్మము నాశ్రయింతు నా
వయ్య పరాకు సేయవల♦దయ్య చలం బిక నేలనయ్య? మా
యయ్య, మదీయమానసము♦నం దువసింపగదయ్య, నేరమే
మయ్య మొరాలకింపవుద♦యాంబుధి కూడలి సంగమేశ్వరా!

చ. అనిశము భక్తితోడ నిట♦లాక్షుడ! నే మొరవెట్టె, నేమిరా
యని యొకసారియుం బలుక♦వద్రిసుతాధరబిందుపారణం
బున గనుమోడ్పుతో భుజగ♦పుంగవపూత్కృతినిస్వనంబు చే
నెనయగ నింతనిర్దయత♦ యేటికి కూడలి సంగమేశ్వరా. ౨౬

చ. కలిగియు బిచ్చమెత్తికొన♦గా నరమాంసము కోరగా మదిం
గెలుగగ నెంగిలిం గుడువ♦గా గలుద్రావగ నింతిచేతి దె
బ్బలు వడగా వెలింబడగ ♦ వాకిలి గావగ లేని తప్పు నీ
కలరగ రాదు పల్కుముద♦యాంబుధి కూడలి సంగమేశ్వరా!

ఉ. ప్రార్థనాల్పమంబు లెడ♦బాపి దయారసదృష్టితోడ నీ
భక్తియొసంగి కావుమని ♦ పల్కురు ప్రార్థన మే నొనర్ప న
వ్యక్తుడ పీడటంచు విడ♦నాడ దలంచెద; వెంచిచూడ న
వ్యక్తుడ నీవ నిశ్చయమ♦యాయిది కూడలిసంగమేశ్వరా!

ఉ. దాసర దాసు పీసమును ♦ గవ్వయు జీతము వేడ నమ్మికల్
జేసెద నాకు కొల్వు దయ♦సేయుమటన్న నొసంగ కెట్లు న
న్వేసట బెట్టజూచెదవు ♦ వేడుక సెల్లునె బిచ్చగానికిన్
దాసిగ గల్గి గల్గిన జ♦వంబున కూడలి సంగమేశ్వరా!

చ. ధనదుడు మిత్రుడు, డిల్లువసుధ♦న్నుతికెక్కిన వెండికొండ, కాం
చనగిరి చాపమై తనర ♦ సర్వవిభూతులు గల్గియుండినం
దనయుని పెండ్లి సేయని యు♦దారగుణాఢ్యుని వెంబడించున
న్ననవరతానాక నిన్ననన♦న్యాయమె కూడలి సంగమేశ్వరా!

ఉ. నిండిన వేడ్క నన్ను గరు♦ణింపక నిన్నటు బోవనిత్తునే
కొండలదాగిన, న్విషము♦గ్రోలిన, నొల్కలలో వసించిన
న్గుండలతో నదూరిన న♦కుంఠిత భైక్షుక వేషధారివై
యుండిన, ప్రాణువృత్తి జెలు♦వొందిన, కూడలి సంగమేశ్వరా!

ఉ. రోకటగొట్టిన న్నిలలు♦రువ్విన పై దళ మెత్తివచ్చినన్
వాకిలి గాచియుండు మని♦నన్ తగ నంజుడు తిండి బెట్టినం
గా కలిదిన వృత్తి నను ♦ గావు మటంచును నెంత వేడినన్
నీకు కటాక్షముం గలుగ♦నేర్చునె? కూడలి సంగమేశ్వరా!

ఉ. జ్ఞానవిహీనత న్మెలగు న ♦ న్గరుణింపక సంతతాత్మవి
జ్ఞానుల బ్రోవ కీర్తియగు♦నా? నిరుపాధికులైన పేదల

న్మాని ధనంబుగ్రానజనంబుల కన్నము బెట్టినక్ యశం
గానెతలంచినాడి హృదయంబునకూడలి సంగమేశ్వరా!

చ. పనివడి భక్తితో పతితపావనమూర్తివి నీ వటంచు ని
న్ననిశము వేడగా పరితు డంచుమదీయగుణంబు లెన్నుచున్
ననువిడనాడె న్యాయమగునా? సతతాశ్రితరక్షకుండవై
యునుముగుణంబులస్వరుస మెంచు రె?కూడలి సంగమేశ్వరా!

చ. ఘను నలినీచు, నీచు ఘనుగా, ధనవంతు దరిద్రిగా, దరి
ద్రుని ధనవంతుగా, సురవరు న్నరుగా, నరుని న్సురుగా
మనుడగుభూవిభు న్బిచ్చుగా, భిక్షుని న్నికలక్ష్మనాథునా
గ, నొనర్చుచిత్రచరితు, కూడలి సంగమేశ్వరా!

ఉ. కన్నుగ దీనవృత్తి నెపుబాపుచు, కన్నులకివ్వక ని
న్నెన్నడజూతు?జూచి, పరమేశ్వర కావుమటంచువందనం
బెన్నడుజేతు? జేసి తప మెప్పుడు ఫలించెనటంచు భక్తిచే
నెన్నడుగోల్తు గొల్చి మదికింపగు మామకవాంఛితార్థమిం
కెన్నడు గాంతునయ్య? జగదీశ్వర!కూడలిసంగమేశ్వరా!

చ. శిలలను దువ్వువారి దయసేయుదు, పువ్వులబూజసేయువా
రల గరుణింప వొల్లవు, ధరాస్థలిపై నతిసాధువృత్తిచే
మెలగినవారి కైకొనరు మేదినినాయకు లంచు బల్కుమా
టలునిజమయ్యె నేడుపరికింపగ కూడలి సంగమేశ్వరా!

చ. గళమునందుమానికముగానక మానక గాజుపూసకై
యిల గలయంగ దరిద్రమతిహీనుడు నిన్గనలేక పొట్టకై
కొలిచితి మానవాధములగొబ్బున నీ వికనైన సత్కృపా
కలితమతిన్ దలంచి ననుగావవె కూడలి సంగమేశ్వరా!

చ. వివరముతోడ నెట్లు నిను♦వేడిన, వేడకయున్న, నన్నుబ్రో
తువు తగనెట్లు నిన్ను నువి♦ధుండు నింజాశుగ్గజాల మబ్జబాం
ధవుడు నిజాతపంబు జల♦దంబు ప్రవృష్టియు నశ్రియత్నతం
దవిలియొసంగుట ల్వినమె♦ధారుణి కూడలి సంగమేశ్వరా!

ఉ. ఏతపమాచరింతు? జప♦మేమిజపింతు? వ్రతాదిసత్క్రియా
వ్రాతము లేమిసేతు? సుక♦రంబుగదీర్ఘము లేమిచూతు? నా
చేత ని కేమి కాదు నిను♦జేరితి దీనుడ నంటి నన్ను ని
ర్హేతుకసత్కటాక్షమున♦నేలుమికూడలిసంగమేశ్వరా! ౮౧

ఉ. నీ నిజరూప మెట్టిదని♦నే నిటలాక్ష! భజింతు? కొంచెమో
మానినిచన్ను సైకతము ♦ మంటిఘటం బొక మేకపెంటికో
మానసమందుసంశయము♦మానదుగావున వేగ దెల్పుమ
య్యా నను గారవించి కరు♦ణాంబుధి కూడలిసంగమేశ్వరా!

ఉ. నీమది యెట్లు సంతసిలు?♦నీదయ నాపయి నెట్లుగల్గు? నా
కేమియుపాయ ముం దెలియ♦ దిప్పుడు గోకట నేతునో? శిలా
స్తోమముచేత రువ్వుదునో? ♦శూరత పైదళమెత్తివత్తునో?
వేమరు తప్పు లెంచి వెలి♦వేతునొ? కూడలి సంగమేశ్వరా!

ఉ. శాంతుడవై మహోగ్రుడవు♦సంగవిదూరుడవై హిమాద్రిజా
కాంతుడవుగ్ర తపోనిధివి ♦ కారణకర్తవు భక్తపాలనా
శ్రాంతుడవుంగృపాబ్ధిభవ♦సంహరుడంచని ని న్నెరుంగ నే
నెంతటివాడ దేవ జగ♦దీశ్వర! కూడలి సంగమేశ్వరా! ౮౩

చ. పునుకల పేరు, మేన కడు♦బూడిద, యేనుగతోలు చిహ్నమై
తనరి,యమంగళుండవగు♦తావక నామ మెదం దలంచువా

రనిశ మనంతమంగళము♦లందుదు రట్టి విచిత్ర మెవ్వరుం
గనుగొన నేరరయ్య త్రిజ♦గంబుల కూడలి సంగమేశ్వరా!

ఉ. సారసగర్భుడాదియగు♦జంతుచయంబు భవన్మహత్త్వముం
పార మెఱుంగకున్న మిము♦భక్తి భజించి తరించి రెట్లనం
క్షీరపయోధిచెంతల వ♦సించుపిపీలికముం మదేభముం
కోరికదీర తత్ఫలము♦గ్రోలవె కూడలి సంగమేశ్వరా! ౨౫

ఉ. సామజచర్మము న్విషము♦చంద్రుడుగంగయు కామభస్మముం
పాములు నీ కభీష్టకర♦వస్తువులౌ నివి నాకు గల్గునే
సేమముతోడ పూజ నిను ♦ సేయుట కింక నొకానొకప్పు నీ
నామము సంస్మరించెద మ♦నంబున కూడలిసంగమేశ్వరా!

చ. ఉదరములోన నొక్కెడ ప♦యోజభవాండశతంబులుండు నీ
యుదరము నిండునట్టులుగ♦నోగిర మెవ్వ డొసంగనోపు నీ
సదమలదివ్యపాదజల♦జంబుల వేడ్క భజించి తృప్తి సే
యుదురుగదా నినుం బరమ♦యోగులు కూడలిసంగమేశ్వరా!

చ. నినుభజియించు ధన్యుడొక♦నీచపువేల్పుల గొల్వ డెట్లనం
అనువుగ జూచి పుష్పరస♦మానెడి భృంగము కాంచనంబు జే
రు నె? నవవారిధారలను♦గ్రోలెడుచాతక మాత్మ నిశ్చయిం
చునె భువి పల్వలోదకము?♦సొంపుగ కూడలిసంగమేశ్వరా!

ఉ. పాములు భూషణంబులు, క♦పాలము పళ్ళెర, మద్రిగేహముం
సామజచర్మ మంబరము ♦ సారెకు గల్గిన బిచ్చగాని నే
నేమని వెంబడింతు సిరు♦లిమ్మని, యింతియ చాలుచాలు నా
స్వామి త్వదీయభక్తియ యొ♦సంగవె కూడలిసంగమేశ్వరా!

ఉ. వేసరక క్రిల్లి సంతతము ♦ పిడు కడుపున్నను వొంబడించె కై
లాసము వేషనో యని త♦లంచెద వేమొ ఘనంబులోన కై
లాసము వేడ నింక పది♦లంబుగ నీపదభక్తి నిమ్ము నే
రాసల పొందనొప్పుముయ♦ధార్థము కూడలి సంగమేశ్వరా!

చ. అల జలజాసనాదులకు ♦ నందని తావకభక్తి లెస్సగా
గలిగిన జాలు, వేరొక సు♦కర్మము సేయకయున్న తక్కువే?
యొలమిప యోజబాధు డుద♦యించిన పిమ్మటదీపమేలొకో
యిల సుధ గల్గగా సశన♦మేటికి? కూడలిసంగమేశ్వరా! ౪౧

చ. పలుకులు వేయు నేలతోలు♦బాములసధ్వరముల్ బుధేంద్రసే
వలుజపము ల్తపంబు లుప♦వాసములాదిగసత్క్రియాతతుల్
సలిపితి నింక నే నిటుల♦నల్పకయున్న త్వదీయభక్తి నా
కలవడనేర్చునే ఘనద♦యాంబుధి కూడలి సంగమేశ్వరా!

చ. పదములదన్నువారికి న♦పారకృపారసదృష్టి మోక్షమిం
పొదవ నొసంగినాడవట♦యూర్జితభక్తి నిరంతరంబు నీ
పదములు బట్టువారలకు♦వంచనసేయక యేమి యిచ్చెవో
మది దలపోసినాకు నెపు♦మా యికకూడలి సంగమేశ్వరా!

చ. సరసిజగర్భ ముఖ్యదియగు♦జంతుగణాంబులు నేర్పుభంగిగా
నిరతము గొల్చువారి గరు♦ణించు నెడక్ సమబుద్ధిజూచెదో
తరతర భావముల్ బహువి♦ధంబుల నెంచెదొ యున్నరూపుసం
స్థిరమతితోడ నాకిపుడు♦ జెప్పుముకూడలిసంగమేశ్వరా! ౪౪

ఉ. ఎవ్వనిచే జగంబు జని♦యించు, వసించు, నశించు, నవ్వ్యయుం
డెవ్వడు కార్యకారణము♦లెవ్వడు భూతసమాశ్రయుండు వా

దెవ్వఁడు చిత్కళాసహితు♦డెవ్వఁ డపారగుణాఢ్యుఁ డీవెకా
యివ్వసుధాస్థలిన్ వెదుక♦నే నిఁకఁ గూడలిసంగమేశ్వరా! ౧౧

చ. అణువులలోన నత్యణువు♦నయ్యు మహత్తులలో మహత్తువై
పరిణతికి నెక్కు నీమహిమ♦పారముముట్ట నెఱుంగ నంబుజే
క్షణ విధిముఖ్యనిర్జరని♦కాయము నేర్చునె? యెంతవాఁడ నే
పరిణతి యొనర్ప జాల పుర♦భంజన కూడలిసంగమేశ్వరా!

ఉ. కొందఱనామరూపు డని♦కొందఱు నిచ్చ నరూపరూపకుం
డందురు కొందరా ప్రకృతి♦యందురు కొందరు చిత్సమన్వితుం
డందురు కొంద రాత్మమయు♦డందురు కొందరు కాలరూపకుం
డందురు కొందరీశుడని♦యందురు కూడలిసంగమేశ్వరా! ౧౭

చ. క్రమమున రజ్జువందు నుర♦గభ్రమ మొందిన యట్లు గాక వి
శ్వము ఘనరాజయోగవిభ♦వంబున దా శివయోగివర్యు భా
వమునకు భేదరూపము ధృ♦వంబుగ బాసి యద్వయభవ్యరూ
పమునకుగా దెసంతతశు♦భప్రద కూడలిసంగమేశ్వరా! ౧౮

చ. శరనిధి దోచు వీచికల♦చందమునం భవదీయరూప మం
దురు సరసీజజాండచయ♦ముద్భవ మొందు నటంచు నీశ్వరే
శ్వరుడవు నీవె కావున భ♦వన్మహిమంబు లెఱుంగ నేర రె
వ్వరుభువనత్రయంబున ధృ♦వంబుగ కూడలిసంగమేశ్వరా!

ఉ. ఈశతనుత్రయైక్యగుణ♦హీనత లేర్పడ రాజయోగవి
ద్యాశుభలీల గాంచిన య♦థార్థము జీవుడ నీ వగు న్నిరా
కాశము తద్ఘటాంతమున♦కారణకార్యవిహీనత న్మహా
కాశమునందు నేకమగు♦కైవడి కూడలి సంగమేశ్వరా!

చ. శరనిధిమగ్నమై ఘటము♦చందమున న్వెలిలోనునుండి భా
సురగగనస్థమై ఘటము ♦ సొంపెస లోవెలిగా గనుండి బం
ధురగతితోడ నన్నిటను♦దోచుచు పూసలలోని త్రాడు భం
గి రహి జెలంగు దీవె పరి♦కింపగ కూడలి సంగమేశ్వరా!

ఉ. మూడిటిరెంటినిన్ గెలిచి♦మూటినిమూటిని రూపుమాపిమూ
న్నాడిటి మూసి మైదిటిని♦పొందుగ నేకము జేసి మూడిటిన్
మూడిటిదాటి రెంటినడు♦ముంగనుచున్నియ యోగిమూడిటిన్
గూడినచోటు విూఱి నిను♦గూడదెకూడలిసంగమేశ్వరా!

ఉ. కూడలి నాదబిందులకు ♦ కూడలి సర్వచరాచరాశికిన్
కూడలి భూతపంచకము ♦ కూడలి వర్ణితశక్తికోటికిన్
కూడలి నాళికాత్రియము ♦ కూడలి బంధురతత్త్వరాశికిన్
కూడలి షట్సరోజముల ♦ కూడలి, కూడలి సంగమేశ్వరా!

చ. పుట్టిననాటనుండి యొక♦పుణ్యమెఱుంగనిమూఢు నన్ను జే
పట్టిన పట్టినాడ విటు♦పట్టి యికన్ విడనాడితేని యీ
పట్టుట నీదె తప్పు, పసి♦బాలునితప్పున కిల్లు వెళ్ళగా
గొట్టుట తల్లిదండ్రులకు♦కూడునె? కూడలి సంగమేశ్వరా!

చ. తెలియక పాపకర్మముల♦ దీరత జేయ మదీయచిత్తమున్
దెలిసి త్వదీయభక్తి నుప♦దేశ మొసంగితివేని జ్ఞానముం
గలిగి మెలంగువాడ నటు♦గా దని వీడుట నీకున్యాయమే
చిలుకకు నేర్ప భాషలు వ♦చింపదెకూడలిసంగమేశ్వరా!

చ. కుముదముల న్సుధాకరుని ♦ కోకిలము ల్మధువాసరంబు ప
ద్మములు దివాకరు న్శిఖి♦తానము నీరదపఙ్క్తి గోరుచుం

దముచే భవత్కటాక్షము ము♦దంబున నీపదభక్తులెల్ల చి
త్తములను గోలుచుండుదురు♦దారత కూడలిసంగమేశ్వరా!

ఉ. కీర్తి సుచందనప్రకట♦కీర్తి తపోధనచక్రవర్తి స
ద్వర్తి నతాదివర్గసమ♦వర్తి హతాదిసమస్తయోగ వి
స్ఫూర్తియనంతభవ్యగుణ♦పూర్తి భవత్ప్రతిమూర్తి దక్షిణా
మూర్తి కటాక్షదృష్టినను♦బ్రోవుత కూడలి సంగమేశ్వరా!

ఉ. ప్రేలుచు నుబ్బి దక్షుఁ డొన♦రించెడి యజ్ఞసరోవరంబు నెం
తే లఘులీల దక్షముఖ♦దేవనికాయముఖాంబుజాతముల్
దూలగ కంఠనాళముల♦దుంచి కలంచిన వీరభద్రశుం
డాలము నెంతు నామదిదృ♦ఢంబుగ కూడలి సంగమేశ్వరా!

చ. అరయగ నాల్గుపాదముల♦నందియలై నిగమాళి మ్రోయగా
గురుతరలీల నొప్పు నల♦గోపురగోపురము న్వసించు మూ
పురము చెలంగ నీయెదుట♦ముద్దులుగుల్క వసించు నందికే
శ్వరు భజియింతు చిత్తమున♦సారెకు కూడలిసంగమేశ్వరా!

ఉ. భైరవు ఘోరశత్రుగణ♦భైరవు నానసచంద్రమండలో
దారవికాసభాసురసి♦తద్యుతిసంతతఫుల్లభక్తదృ
క్కైరవు వేడ్క నాహృదయ♦కంజమునందు వసింపజేతు వి
స్తారకృపాంతరంగహృదయము♦దాటగ కూడలిసంగమేశ్వరా!

చ. కొలఁదికి మించి తాను కుల♦గోత్రసముద్భవయై చెలంగి ది
క్కులవరగోత్రహీను నిను♦గోరి వరించి త్రిలోకకల్పకో
జ్జ్వలపటుశక్తిగా భువన♦వంద్యనిగా నొనరించు శాంభవిం
దలతు మనంబులోన శుభ♦దాయక కూడలి సంగమేశ్వరా!

ఉ. కాసుకు కందపద్య మర♦గాసుకు వృత్తము గ్రుడ్డిగవ్వకున్
సీసముగా నిటుల్ చవుక♦జెందు కవిత్వము గావున న్మదో
ల్లాసితులౌ ధరాధిపుల♦లక్ష్యము సేయక నీపయిన్ గృతిన్
జేసెద వేగ నన్ను దయ♦సేయుము కూడలిసంగమేశ్వరా!

ఉ. కంటకులౌ ధరాధిపుల ♦ గాంక్షల గొల్చుచునుంటిగాని నీ
వంటి దయాళు భక్తజన♦వత్సలు నామది గొల్వనైతి ని
ష్కంటకవృత్తిగా కెటుల♦గల్గు భవచ్చరణంబుదక్క నీ
బంటుగ నేలుకొ మ్మఖిల♦పావన కూడలిసంగమేశ్వరా!

ఉ. అక్షులయందు నిర్మలద♦యామృతపూరము లుప్పతిల్ల రు
ద్రాక్షలపేరు లొప్పగ ను♦రంబున విస్ఫురితపార్వతీసరో
జాక్షియు వామసీమ వెల♦యంగ మహోక్షము నెక్కినాకు బ్ర
త్యక్షము గాగదయ్య విశ♦దంబుగ కూడలిసంగమేశ్వరా!

ఉ. నీ నగుమోము సోయగము ♦ నీగుణవర్తనలెల్ల చూడగా
మానస మిచ్ఛయించెకడు♦మున్నసతో భవదీయరూపమున్
గానగజూపవయ్య పౌఢ♦గాంచెద నామది కోర్కెదీరగా
దీనత బాయ పాలితసు♦ధీజన కూడలి సంగమేశ్వరా! ౨౫

ఉ. హాటకభూధ రందరిము శ♦రాసనమై ధనదుండు మిత్రుడై
పాటిగ నన్నపూర్ణ నిజ♦భార్యయునై చెలువొందుచుండ భి
క్షాటన మేల మూన వహా♦హా తినజాలవు నీకు లౌభ్య మిం
కేటికి జాలు లాఘవము♦నెంచవు కూడలి సంగమేశ్వరా!

చ. కలుషములెల్ల బాపి నను♦గావు మటంచిల భక్తితోడుతం
బలుమఱు వేడగా ననుకృ♦పామతి జూచుచునొక్కసారియున్

బలుకవు లోపల న్విషము ♦ పైనమృతంబుగాగి గల్గునట్టి వా
రల మది నెమ్మదిం బ్లైని ధ♦రాస్థలి కూడలి సంగమేశ్వరా!

చ. దురితనికుంజము ల్నరికి ♦ దుర్గుణదూర్వము పోవ దున్ని సు
స్థిరముగ నామమం బనెడి ♦ చే నొగి నీపదభక్తిసస్యముల్
గురుతుగ నాటి దుర్విషపు♦గోతతి ద్రొక్కగనీక పంట లే
ర్పఱచి ఫలంబు గైకొనుము♦పాయక కూడలిసంగమేశ్వరా!

ఉ. ఆరయ తృష్ణచే కలిమి♦యర్థ మృగతృష్ణల కాస జెందుచుం
గ్రూరభవాటవిన్ దిరుగ♦క్రూరదురింద్రియచోరులాత్మవి
ద్యాగతివిత్తముం గొని మ♦హాఘలతాతతి గట్టి రింక నన్
జేరి భయంబుమాన్పిదయ♦సేయుము కూడలి సంగమేశ్వరా!

ఉ. ఎనయగ మన్మనోవృషభ♦మేపున భవ్యవివేకసస్యముల్
దిని కసుకొట్టివిర్వ దుర్విషయ♦ధేనుపుల న్దగ పొంది దోషకా
ననమున జొచ్చె, దాని నిక♦జ్ఞానమనే ములుగోలబట్టి వా
హనముగ నీవు గైకొను ద♦యామతి కూడలిసంగమేశ్వరా!

ఉ. భూరితరక్షుధాజలము ♦ బుద్బుదసంఘము తృష్ణగా విప
ద్ఘోరతరంగజాలమును ♦ దుష్కృతపంకము గల్గునట్టి సం
సారపయోధి నీదుటకు ♦ శక్యమె తావకభక్తినావపై
జేరిచి వేగ నన్ను దరి♦జేర్చుము కూడలి సంగమేశ్వరా!౨౧

ఉ. జోకసతీపయోధరము ♦ చూరగు నెంత నురోజదుర్గముల్
జేకొని తత్సమీపమగు♦సీమకు దాడివెడలి నచ్చె దుర్మదో
ద్రేకత నిండియధ్వజని♦ధీరతగొల్వగ మన్మనోనృపుం
డీకలుషాత్ముసాధువుగ♦నేలుము కూడలి సంగమేశ్వరా!

చ. అరయుగ యేమరించి వని♦తాధరబింబఫలంబు లానగా
సరగున మన్మనశ్శుకము♦సారెకు సారెకు దుష్కృతాటవిఁ
దిరుగ దొడంగె దాని నిక♦దెచ్చి త్వదీయపదాబ్జభక్తిపం
జరమున నిల్పుమయ్య విల♦సత్కృపఁగూడలిసంగమేశ్వరా!

ఉ. నామది దుష్టపన్నగము♦నా దనరుఁ గుటిలప్రచారతన్
వేమరు లోకకృద్భయద♦వృత్తి చరించుట సత్పదక్రమం
బేమి యెఱుంగకున్కి నిక ♦ నీవు ధరింపుము వీని నీవలెన్
పాములు దాల్తుకోగద సు♦పర్వులుకూడలిసంగమేశ్వరా!

ఉ. ఊరొక రాలమిట్ట తన♦యుల్ మఱుగుజ్జును భైరవుం డొగిం
దార తలంప చండిక స♦దా తల యేరిక బిచ్చమెత్తి సం
సారము సేయలే నని వి♦షం బిటు ద్రాగిరో లేక లోకవి
స్తారభయంబుమాన్పుటకు♦ద్రాగిరొ కూడలిసంగమేశ్వరా!

ఉ. ఆపదగల్గువేళను భ♦యాతురతన్ మొఱబెట్ట నాదు సం
తాపము మాన్పకుండితివి ♦ ధర్మమె? యాకలివేళ నన్నమీ
నోపకయున్న ప్రాణిచయ ♦ మోర్చునె? నీమదిలో నెఱుంగవే
నీపదభక్తి నిచ్చి కరు♦ణింపుము కూడలిసంగమేశ్వరా!

ఉ. పోడిమిమీర మీచరణ♦ము ల్మది నెప్పుడు వీడ నన్యులన్
గూడ మ శేమిమెక్కువలు♦కోర దురాత్ములపొందుజూడ నీ
వాడ పరాకుచేత నను ♦ వంచన జేసితివేని నాకు ది
క్కేడ మొరాలకింపు చల♦మేటికి కూడలిసంగమేశ్వరా!

ఉ. ఇవ్వసుధాస్థలంబున మ♦రెవ్వరి వేడను నిన్నెకాని యేం
చివ్విధి బల్కగా బలుక ♦ కిట్లు పరా కొనరించితేని నే

నెవ్వగివాడనౌదు నిక ♦ నెవ్వరి వేడుదు దీనవృత్తిచే
నెవ్వరి సాక్షియింతు జగ♦దీశ్వర కూడలిసంగమేశ్వరా!

ఉ. పాపములెల్ల వేగ నెడ♦బాపుము నీచరణాంబుజాతముల్
జూపుము నీదయామృతము♦సోకగ మామకచిత్తమందుసం
తాపము మాన్పుమయ్య పలు♦మాఱును జెప్పగ నేల దీనర
క్షాపృథుకీర్తి యేమరకు ♦ సారెకు కూడలిసంగమేశ్వరా!

ఉ. కొంచక నాదుపాపముల♦కు న్మదిరోయక నన్ను ప్రేమ వీ
క్షించి మనంబు సుస్థిరము♦జేసి పయిన్ గరుణామృతంబు వ
ర్షించి పరాకు లేక దయ♦సేయుము చెక్కిలిగొట్టి పాలు ద్రా
వించిన చాడ్పున న్ననరు♦పీడ్వకన కూడలిసంగమేశ్వరా!

చ. అడుగక కొల్చువారి మను♦జాధిపులెంతయు సమ్మతింతు రీ
పుడమిని నట్టి నిన్ను కడు♦మోదముతో భజియింతు నేమిని
న్నడుగక నంచు బల్క నహ♦హా కనుపింపవు లోకమందు నే
ర్పడ దొరవంచుని న్నెఱుల♦బల్కుదు కూడలిసంగమేశ్వరా!

ఉ. ఎన్నిభవంబులెత్తితినొ♦యింతకుపూర్వము యింకమీదనిం
కెన్నిభవంబులౌనొమది ♦ కేమియుపాయము తోచదైన నా
పన్నశరణ్య నీచరణ♦పద్మములే గతి నీదయారసం
బెన్నడు వచ్చు నాయెడల ♦ నిమ్ముగ కూడలిసంగమేశ్వరా!

చ. నెనరుదలిర్ప కోరికలు ♦ నీవలె నీవలె నంచు నిచ్చువా
రిని గన నెందునైనను♦ప్రేమను నామనమందు గొల్చుచుం
డెను సిరులిచ్చి ప్రోవుదయ♦తోడను వేడను మానవావలిన్
వనజభవాదివంద్య జిత♦వారణ కూడలి సంగమేశ్వరా!

ఉ. సారెకు నీవె దిక్కని ని♦జంబుగ నామది నమ్మియుంటి నా
నేరము లెంచ కింక కరు♦ణించి దయామతి జూడకున్న నె
వ్వారలు దిక్కు నే నెవరి♦ వాడను దీనతమాన్వజాలువా
రేరి దయాఘ్నురేరి షగ♦మేశ్వర కూడలి సంగమేశ్వరా! ౯౮

ఉ. సంచితదుష్కృతంబు లని♦శంబు హరించి మొరాలకించిపా
లించుము దీనవృత్తు లెడ♦లించుమునీకరుణామృతాబ్ధి దే
లించుము లేములెల్ల వద♦లించుమునీదగుముగ్ధమోము జూ
పించుము కోర్కులెల్లగురి♦పించుముకూడలిసంగమేశ్వరా!

ఉ. ఎన్నడు నన్ను గాచెదవొ♦యెన్నడు నీచరణాంబుజాతముల్
కన్నులజూతు నెన్నడు సు♦ఖంబున నుండుదునయ్య సంతతా
పన్నశరణ్య యో ప్రమథ♦పాలన యోసుఖమార్గబంధు నా
విన్నప మాలకించు కను♦వేగమె కూడలి సంగమేశ్వరా!

ఉ. నీపదపంకజద్వయము♦ నెమ్మది నెన్నగ నొక్కటూరికిన్
జూపగదయ్య యోభువన♦సుందర యోగిరిజాధినాథ యో
పాపవినాశ యోఘనసు♦ఖప్రద యోకరుణాసముద్ర యో
తాపసపోష యో ధృతసు♦ధాకర కూడలి సంగమేశ్వరా!

ఉ. నీమది నే నెఱుంగుదును ♦ నేర్పు దలిర్పగ వట్టిమాటలన్
వేమరు బుజ్జగించి నను ♦ వేడదలంచెద వట్లుగాదు నా
స్వామిగ నిన్ను నొక్క♦నిమిషంబెడబాయక వెంటనంటితిన్
కామితసిద్ధి సేయదగు♦గ్రక్కునకూడలి సంగమేశ్వరా! ౯౫

చ. చనువున జేసి నిన్నిటుల♦సారెకు దూరితి నిందుకై మనం
బున గడు గోపగించి నను♦పోవిడనాడుట నీకు న్యాయమే

తన•జఠరస్థుడౌ శిశువు ♦ దన్నిన నేరము లెంచనేర్చునే
జనని ధరిత్రి భక్తజన♦ సన్నుత కూడలి సంగమేశ్వరా!

చ. ముదమున తొల్లి భక్తజన♦ ముల్ గరుణించితివంచు శాస్త్రము
ల్చదువుదు రెల్లపెద్ద లవి ♦ సత్యములై చెలువొందెనేని నే
మదిదగ నన్ను బ్రోతువిక♦ మాటలు వేయును నేల యింక నా
మది పదిలంబు జేసెద క్రమంబున కూడలి సంగమేశ్వరా!

చ. చిరకృపమంగళాద్రిసర♦సి...హుడు నామది పాదులోన సు
.. స్థిరముగ నాటు బీజము త్వ♦దీయకటాక్షసుధా ప్రవృష్టి పై
గురిసిన వృద్ధిగాం చెసల♦గూడను మామక కావ్యకల్పవ
ల్లి రహి బుధాళి మెచ్చగ భ♦వ యని కూడలి సంగమేశ్వరా!

చ. సరసయువర్ణసంయుతయు♦సాంద్రసులక్షణయుస్సదర్థసం
భరితయునై కలోద్భవత♦భాసిలు మామక కావ్యకన్యకం
బరిణయమైత్వదీయపద♦ భక్తయునుంకువగానొసంగుమా
పరమకృపావలోకనశు♦భప్రద! కూడలి సంగమేశ్వరా!

చ. ప్రకటముగాగ నెలుయు శు♦భప్రద! సేవకకోటయందు స
న్నొకనిగ, మామకీన కవి♦తోత్పలచంపకనవ్యపుష్పమా
లిక గుణ భక్తి నిచ్చెద స♦లీల దలిర్పగ బిచ్చమెత్తి మ
చ్చికదళుకొత్త దీని నిక ♦ జేకొను కూడలి సంగమేశ్వరా!

ఉ. మేలగు తుంగభద్రకు స♦మీపమునం దమరావతీపురిన్
బోలిన యుట్టి చానూరల♦ఘూడిపురిం దగ సర్వమంగళా
లోలుడవై వసించి సిరు♦లు న్నిజభక్తులకిచ్చుచున్ దయా
శీలత నొప్పుచుందువు ప్ర♦సిద్ధిగ కూడలి సంగమేశ్వరా!

చ. నరహరిభక్తిమించురఘు♦నాయకమంత్రికిసూరమాంబకున్
వరసుతుడన్ ధరన్ పరిమి♦వంశజుడన్ భవదీయదాసుడన్
హరితసగోత్రజుండ చెలు♦వంద జనించితి నాదిశాఖయం
దరయగ వేంకటాచల స♦మాఖ్యుడ కూడలిసంగమేశ్వరా!

చ॥ హిత కమలాక్ష నీపదము♦లెప్పుడు వేడుక నామనంబున
న్గుతుకముతో భజించి యిక♦కోరికతోడ త్వదంకితంబుగా
శతకము జెప్పి నీ కిపుడు ♦ సమ్మతి నిచ్చెద దీని జాళువా
పతకముభంగి గైకొను కృ♦పామతి కూడలిసంగమేశ్వరా!

చ. ఇది కడుభక్తితోడ బఠి♦యించి లిఖించినవారి కిష్ట సం
పదల నొసంగి నీచరణ♦భక్తియు ముక్తియు నిమ్ము సంతతా
భ్యుదయుడవై సుధాకరప♦యోజపటీరతుషారహీరశా
రదఘనచందనాభరుచి♦రస్మిత కూడలిసంగమేశ్వరా!

ఉ. మంగళ మంబికాసహిత ♦ మంగళ మార్యశుభప్రదాయకా
మంగళ మాహవప్రికట ♦ మంగళ మంబుజనేత్రసాయకా
మంగళ మిందుఖండధర ♦ మంగళ ముగ్రమహాఘశోషణా
మంగళ మభ్రకేశ గుణ♦మండన కూడలిసంగమేశ్వరా!

కూడలిసంగమేశ్వరశతకము

సంపూర్ణము.